# గాలిదేవుడు

[ఇతరకథలు

మునిమాణిక్యం నరసింహారావు

ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ-2

ఇం దు లో

# కొండయ్య

1

కొండయ్య బరువు రెండువందల పౌనులు. ఇక ఆ మనిషి ఎంత లావో ఊహించుకోండి. కొండయ్య నిజంగా ఒక చిన్న కొండే ! ఎవరిపై ఎక్కిబారిన నేమి ప్రయోజనము.

ఆయన నడుస్తూఉంటే ఒక చిన్న పర్వతం కదులుతూ ఉన్నట్లుగా ఉంటుంది' ఆయన కాళ్ళక్రింద భూమి క్రుంగి పోతూ ఉంటుంది.

కొండయ్య భాగ్యవంతుడు కావలసినంత డబ్బుఉన్నది. తోడబుట్టినవాళ్ళు ఆయన కెవరూ లేరు. ఆయనా, ఆయన తల్లీ ఉంటున్నారు.

ఒక పెద్ద భవనంలో కొండయ్య కాపురము. ఆఇంట్లోన విశాలమైన గదులు ఎన్నో ఉన్నవి. కొండయ్య మేడపై రెండు గదులు తనకోసం అట్టి పెట్టుకొన్నాడు. ఆతడు ప్రాప్త వ్యవహారుడు అయినకారణాన ఎందరో ఆయన దగ్గరకు వచ్చి పోతూ ఉండేవారు.

మేడపై నున్న రెండు గదులలో ఒకటి ఎవరైన వచ్చి నపుడు కూర్చుండేందుకు ఏర్పడినది. ఆ గదికి అటూ ఇటూ ఉన్న ద్వారబంధాలు అంత విశాలమైనవిగా ఎందుకుఉన్నవో మనము సులభముగా ఊహించుకోవచ్చును.

దాని ప్రక్కనే ఉన్న రెండవగది అంతకంటే విశాలమైనది అది కొండయ్యగారి పడకగది. ఆ గది గోడలపై

చిత్ర విచిత్రములైన పటములున్నాయి. అందు అలమారలలో రకరకాల పుస్తకము లున్నాయి.

కొండయ్య ప్రాప్తవయస్కుడైనా ఇంకా వివాహము చేసికొనలేదు. ఆయన చేసికొనక పోవుటకాదు. ఆయనకు పిల్లను ఎవ్వరూ ఇయ్యలేదు. తల్లే వండి పెడుతున్నది అతనికి సేవ చేయడానికి సేవకులు కావలసినంతమంది ఉన్నారు.

కొండయ్యకు డబ్బు సంపాదించవలసిన అవసరము లేదు. పెద్దలు సంపాదించి ఇచ్చిపోయిన ఆస్తిబోలెడు ఉన్నది. అందుచేతనే కొండయ్య ఎక్కువగా విద్యావ్యాసంగంలో కాలం గడుపుతూ ఉండేవాడు. అప్పుడప్పుడు స్నేహితులతో హాస్య ప్రసంగాలు చేస్తూ సుఖంగానే జీవిస్తున్నాడు.

కాని కొండయ్య నిర్లిప్తుడై ఆనందంగా కాలం గడుపుతున్నాడు అంటానికి వీలులేదు. భృత్యులకు లోటులేదు. భృతికి లోటులేదు. విలాసములకు కొదువలేదు. కాని ఆయనకు ఒంటిరి జీవితము దుర్భరము అనిపించినది. అందరివలెనే తాను పెండ్లిచేసికొని పిల్లలను గని సుఖంగా ఉండాలని ఆతని కోరిక. కాని ఎవరూ ఆయనకు పిల్లను ఇయ్యడానికి ఒప్పుకోలేదు.

అయ్యబాబో అతడు మనిషిలాగ ఉండడు. విపరీతమైన లావు! మాంసపు కండరములు ఒకదానిపై నొకటి పేర్చగా ఏర్పడినది ఆతని శరీరము. కొన్ని కండరములు వ్రేలాడుతూ ఉంటవి. అతడొక రాక్షసుడు. కాలు కదపలేని స్థూల కాయుడు.

ఆతని కాయకస్థౌల్య మాతని కొక వికృతరూపమును తెచ్చి పెట్టింది.

దానికితోడు కొండయ్య కన్నులు రక్తోత్పలములవలె ఎఱ్ఱగాను భయంకరముగాను ఉండేవి. అట్టి వికృత రూపికి ఎవరు పిల్లనిస్తారు!

ఈ శరీరం తగ్గి తేలిక అయిపోతే ఎంత బాగుండును!

తానూ అందరిలాగే నడుస్తూ తేలికగా అటు ఇటూ తిరుగగలిగితే ఎంత బాగుంటుంది! అని అనుకొనేవాడు కొండయ్య.

ఏ భగవంతునికైనా దయ వచ్చి తనను మాములు మనిషిగా చేస్తే బాగుండునని వేయి దేవుళ్ళకు మొక్కు కొనేవాడు కొండయ్య.

కాని ఏ దేవుడికీ దయరాలేదు. పరమేశ్వరుని కరుణా కటాక్ష వీక్షణానికై కొండయ్య పరితపించిపోయినాడు. ఉపవాసములు చేసినాడు. కాని ఆతని శరీరము తులమైనను తగ్గలేదు. అంగుళమైనను జంకలేదు.

ఔషధ సేవవలన ఏమైనను లాభించక పోతుందా అని ఆతనికి తోచినది. ఎంతమందినో అటువంటి మందు ఏదైనా ఉంటే చెప్పమని ప్రార్థించినాడు. కాని ఈ విషయములో ఎవ్వరుగాని ఆతనికి ఏవిధమైన సాయమును చేయలేక పోయినారు. మందు మాకులవలన తటమటయేగాని తక్కువపడుట జరుగలేదు. తగ్గుదలలేదు తగులుబడి మితిమీరినది.

పత్రికలలోని ప్రకటనలను కొండయ్య జాగ్రత్తగా పరిశీలించి, ఆ మందులేమైనా పనిజేస్తాయేమోనని ఆశపడ్డాడు

అవి ఏమీ పనిచేయలేదు. అతనికి విచారం ఎక్కువయింది. జీవితము దుఃఖభాజనము అయిపోయింది ఏమి చేయడానికీ పాలుపోలేదు.

ఈ స్థితిలో అతనికీ నాకూ పరిచయం ఏర్పడ్డది ఒక రోజున కొండయ్య తన దీనావస్థ అంతా నాతో చెప్పుకొని కళ్ళనీళ్ళు పెట్టుకొన్నాడు

'ఈ మాత్రానికి నీవు ఎందుకయ్యా ఇంత దుఃఖ పడతావు? స్థూలకాయము ఉన్నంతమాత్రాన నీకు వచ్చిన నష్టం ఏముంది? నీవు కష్టపడి పనిచేయవలసిన అవసరంగాని, డబ్బు సంపాదించవలసిన అగత్యంగాని లేదుగదా! అని ఎంత చెప్పినా ఆయన ఊరట చెందక, ఎల్లాగయినా ఈ స్థౌల్యం పోయే ఉపాయం చెప్పమని ఎంతో ప్రాథేయపడ్డాడు.

నాకు చాలా జాలివేసింది. ఆయనకు ఏవిధంగా సాయ పడదామా అని ఆలోచించినాను.

మా మేనత్త ఒక ఆమె మలయాళ దేశస్థుని వివాహ మాడి, ఆ దేశంలో నలభై సంవత్సరాలు కాపురం చేసింది. ఎన్నో మంత్రాలూ, మందులూ ఆమె సంపాదించినది భర్త చనిపోయిన తరువాత ఆమె తిరిగి మన దేశం వచ్చి కొంత కాలం జీవించి, వృద్ధురాలై చనిపోయింది. ఆమె తాను నేర్చిన తంత్రాలు, మంత్రాలూ, అన్నీ ఒక పుస్తకంలో వ్రాసి ఉంచినది. తాను సంపాదించిన మందులనుగురించికూడా ఆమె వ్రాసి పెట్టుకొన్నది.

ఆ కాగితాలు చూస్తే కొండయ్య లావు తగ్గించే టందుకు ఏదైనామందుదొరకవచ్చునని నాకుఅప్పుడుతోచినది.

కాని ఆ మందులవలన సత్ఫలితాలు రానూ వచ్చును. రాకపోనూవచ్చు ఇదమిద్ధమని ఏమీ చెప్పలేము.

ఆ మందులు తయారుచేయడంలో ఏదైనా లోపం జరిగితే అవి వికటించి అపకారం చేసినా చేయవచ్చు.

కాని ఆయన దీనావస్థ, ఆతని ఔత్కంఠ్యము చూచి నేను జాలిపడ్డాను. అందుచేత ఆ విషయమున జాగ్రత్తలు విచారిస్తూ కూర్చొనక, వెంటనే. "సరే, ప్రయత్నిస్తాను" అన్నాను.

"కొండయ్యా, మా మేనత్త వ్రాసిపెట్టిన ప్రక్రియలు నీకు ఏమైనాపనికొస్తవేమో చూస్తాను. లావు తగ్గి నాశరీరము తేలిక కావడానికి ఏదైనా మంత్రమో మందో దొరకవచ్చు" అన్నాను

ఆయన చాలా సంతోషించినాడు.

' కాని అవి ఎప్పుడూ మంచి పని చేస్తవిఅని అనుకొంటానికి వీలులేదు. ఆ మందులు బహు జాగ్రత్తగా తయారు చేయవలెను. అందులో వ్రాసిపెట్టినరీతిగా మూలికలన్నీ సమకూర్చి ఆయా పాళ్ళలో కలిపి పుటంబెట్టి చూర్ణం చేయవలె. ఎక్కడ ఏ పొరపాటుజరిగినా కొంపమీదికి వస్తుంది. ఆమందులకు విరుగుడు మన ఆయుర్వేద వైద్యులు ఇయ్యలేరు.ఏదైతే అది అవుతుందని మొండి ధైర్యంతో పుచ్చుకొంటేపుచ్చుకో. లాభించనూవచ్చు. లాభించకపోనూ వచ్చు నీవే ఆలోచించుకో. కావలిస్తే ఆ కాగితాలన్నీ వెదకి నీకు కావలసిన ప్రక్రియ ఏమైనాఉందేమో చూస్తాను''అని కూడా చెప్పినాను.

కొండయ్య ఒక్క క్షణం ఆలోచించినాడు. చివరకు అన్నాడు. 'ఈ బరువును ఈడుస్తూ బ్రతికేకంటే మరణమే వాంఛనీయము అనిపిస్తుంది. ఏదైతే అది అవుతుంది. ఈ కాయిక వైకృతిని నేను సహించలేను. ఆ పుస్తకంలో దీనికి ఏమైనా మందు ఉందేమోచూడు'' అని నన్ను ఎంతో బతిమిలాడినాడు.

'సరే' నని చెప్పివచ్చివేశాను.

## 2

పది పదిహేను రోజులు ఏకదీక్షగా వెదకిన తరువాత ముక్కలు, మదుసునూరి మట్టిచెయ్యగా తయారయ్యే ఒక ప్రక్రియ కనిపించినది. 'వారంరోజులు ఆ చూర్ణం సేవిస్తే, మనిషి బరువును కోల్పోయి తేలిక అవుతాడు' అని వ్రాసి ఉన్నది.

అది తీసికొనివెళ్ళి కొండయ్యకిచ్చి ''అబ్బాయీ, ఇది ఒక్కటే కనిపించింది. ఇది మనిషి తేలికకావడానికి మందుట ! నీకు కావలసినది లావుతగ్గటము కాని తేలిక కావడము కాదు. ఈ తేలికకావడము అంటే ఏమిటో ఏమవుతావో నాకు సరిగ్గా తెలియడములేదు. దీనివలన ఏమికొంప మునుగుతుందో నేను చెప్పలేను. ఆలోచించుకొని నీయిష్టంవచ్చినట్లు చెయ్యి.

ఎగుసుదిగుడు అయితే నన్నేమీ అనకూడదు'' అని స్పష్టంగా చెప్పి, మరీ యిచ్చాను.

ఈ శరీరాన్ని మోయలేక చస్తున్నాను. తేలికఅయితే అదీ ఒక లాభమే. శరీరం తగ్గనిదే తేలిక కావడము ఎల్లా సంభవము ! ఆ విషయము వ్రాయకపోయినా శరీరము తగ్గి తేలిక అవుతుందనే దాని అర్థము. మనము తర్జనభర్జన చేయ పద్దు. మీన మేషాలు లెక్కపెడుతూ కూర్చుంటే కాదు. నేనేమీ భయపడను 'ఏదైతే అది అవుతుంది' అంటూ ఆ కాగితాన్ని ఆయన తీసికొని డ్రాయరులో పెట్టుకొన్నాడు.

కాసేపు అయినతరువాత కొండయ్య అన్నాడు. ''రెండు రోజులలో మందు తయారు చేయిస్తాను. నీవు మటుకు ప్రతిరోజూ సాయంత్రం ఒకసారి ఇటు వచ్చి చూచి వెళ్ళుతూ వుండు. నా శరీరము తగ్గి మీ అందరిమోస్తరు మామూలు మనిషిని అయినానో, పెళ్ళి చేసుకొని సుఖపడతాను. లేదా ప్రాణాలు విడవడానికి కూడా వెనుదీయను'

ఆ తరువాత రెండు రోజులలో మందు తయారు అయింది. మంచి ఘనవైద్యుల సాహాయ్యం తీసికొని, ఎన్ని మూలికలు కలపవలయునో అన్నీ కలిపి ఏలోపము రాకుండా ఔషధము తయారుచేయించినాడు.

కొండయ్య మందు పుచ్చుకోవడం ప్రారంభంచేసి నాడు మంచిరోజు చూచి.

నాలుగో రోజునకే ఆతనికి గుణము కనుపించసాగినది. ఏదో ఒడలు తేలికఅయినట్లు తోచింది. గాలిలో తేలిపో తున్నట్లు అనిపించింది అతనికి.

కొండయ్య అమితమైన ఆనందం పొందసాగినాడు. ఆయన నడుస్తూఉంటే కాళ్ళు తేలిపోసాగినవి. పూర్వము అతనికి అడుగు తీసి అడుగు వేయడమే కష్టం అనిపించేది. ఇప్పుడు అతడు తేలికగా పరుగెత్తగలుగుతున్నాడు

ఈ స్థితి కొండయ్యకు ఎంతో హాయి అనిపించింది "శరీరంకూడా తగ్గిపోతుంది తాను మామూలు మనిషి అయిపోతాడు. అప్పుడు ఎవరు బతికితే వాళ్ళే పిల్లనిస్తారు తనకేం తక్కువ !" ఈ ఆలోచనలు వచ్చి అతడు ఆనందంతో ఊగిపోయినాడు.

ఆ తరువాత అతనికి ఎన్నో మధురాతి మధురమైన ఆలోచనలు వస్తూఉండేవి. తనకు ఇల్లు వాకిలీ, ధనం, ధాన్యం అన్నీ ఉన్నవి ఈ దేహసంబంధమైన స్థౌల్యంపోతే తనకు వివాహం కాక ఏం జేస్తుంది ! తప్పక అవుతుంది. ఎవరో ఒకరు పిల్లను ఇస్తారు. తనకు సంతానంకూడా కలుగుతుంది. తన తల్లి ఎంత సంతోషిస్తుందో మనుమలను మనుమరాండ్రనూ చూచుకొని. ఇల్లాంటి మధురమైన ఊహాలలో అతడు ఉబ్బితలూగిపోయినాడు. అతనికి ఒడలు గగుర్పాట కలిగింది.

ఆ రాత్రి ఆయనకు ఎప్పుడు నిద్ర పట్టిందో ఆయనకే తెలియదు. ఆ రాత్రిఅంతా ఆయన మధుర స్వప్నాలుకంటూ గాలిలో తేలిపోయి, నందనవనంలో విహారంచేసినాడు.

ఆ మరునాడు ఉదయానే, ఇంకా నేను నిద్ర లేవక పూర్వమే ఎవరో తలుపు తట్టి గోలగాపిలవడము వినిపించింది.

నా ఆవిడ తలుపు తీసి 'ఎవరబ్బాయి! ఎవరికోసం? ఎందుకొచ్చావు? అని అడుగుతూ ఉండడముకూడా విని పించినది

ఆ వచ్చిన కుఱ్ఱవాడు, రొప్పుకుంటూ రోజుకుంటూ, 'అయ్యగారిని ఉన్నపాటున రమ్మన్నారండి కొండయ్యగారు. కొంప మునిగిందని చెప్పమన్నారండి' అంటున్నాడు.

నిద్రమత్తులో ఉన్నా నాకు ఆ మాటలు స్పష్టంగా వినిపించినవి. నేను లేచి గుమ్మంలోకి వెళ్ళి 'ఏమిటయ్యా గొడవ, ఏమి జరిగింది' అన్నాను.

'ఏమి జరిగిందో తెలియదండి. అయ్యగారు గదిలో నుంచి బయటికి రావడము మానేశారండి! లోపల గడియ వేసుకొని కూర్చున్నారు' అని ఆ కుఱ్ఱవాడు చెప్పేసరికి నాకు ఎంతో ఆశ్చర్యము కలిగింది.

'లోపల ఏమి చేస్తున్నారురా?' అని అడిగినాను ఎంతో ఆతుర్దాగా.

'ఏం చేస్తున్నారో తెలియదండి. ప్రొద్దున కాఫీకికూడా రాలేదు. ముసలమ్మగారు పిలిచినా, 'నేను రాను, నన్ను

మాట్లాడించబోకండి' అని విసుగ్గున్నారు. ఏవో విచిత్రమైన ధ్వనులు వినవస్తున్నవి. బాబూ తలుపు తియ్యండి అన్నాను నేను. అంటే ఆయన తలుపు తీయడానికి వీల్లేదు. నీవు వెళ్ళి పంతులుగారిని తీసుకురా. ఇక్కడున్నట్లు రమ్మను. కొంప మునిగి పోయిందని చెప్పు' అన్నారండి అన్నాడు.

వాడి మొఖం చూచినా, వాడు చెప్పేపద్ధతి చూచినా ఏదో భయంకరమైన విపత్తు సంభవించి ఉంటుందని తోచింది.

ఇంతలో మా ఆవిడ అందుకొన్నది. ఆవిడకూ తోచింది కొండయ్యా ఏదో ఆపదలోనే ఉన్నట్లు. 'ఉన్నవారు ఉన్నట్లు ఉండరాయె మీరు ! ఆ మందు ఏదో ఇస్త్రిరి ! పాపం ఏమి జరిగిందో ! ఏదో నెత్తిమీదకురాబట్టే ఆయన అల్లాగ కబురు చేసినాడు. తొందరగా ముఖంకడుక్కోవడమూ అదీ కానిచ్చి ఆయన దగ్గరకు పరుగెత్తండి' అని గోల పెట్టింది ముఖప్రక్షాళనాది కార్యములు తొందర తొందరగాముగించి నేనూ పరుగెత్తుకొని వెళ్ళాను.

# 4

నేను వెళ్ళేటప్పటికి, అంతా గందరగోళంగా ఉన్నది. తల్లి ఏడుస్తూ కూర్చున్నది. పనివాళ్ళు అటూ ఇటూ పరుగెత్తుతున్నారు. ఎవ్వరికీ స్థిమితంలేదు. ఏమిట్రా సంగతి అంటే ఎవ్వరూ చెప్పరు. చెప్పడానికి ఎవ్వరికీ అసలు ఏమి జరిగిందో

...యున్నారు. 'అయ్యగారు లోపల తలుపు వేసుకొని కూర్చు... తలుపు తీయమంటే తియ్యరు' ఈ ఒక్కమాటే ... చెప్పినా !

నేను యకాయకీని మేడపైకి వెళ్ళి ఆయన గది తలుపు తట్టినాను. 'కొండయ్యా ఏమిటయ్యా సంగతి ?' అని గట్టిగా అరిచినాను.

దానికి సమాధానం వెంటనే రాలేదు. లోపల ఎవరో మెల్లగా ఏడుస్తూ ఉన్నట్లు వినిపించినది.

'ఏమీ ఫరవాలేదు. భయపడకు. ముందు తలుపు తియ్యి' అని కేకవేసినాను.

'ఎట్లాగు రావడము ? అయినా ఉండుండు' అని కొండయ్య లోపలనించి సమాధానము చెప్పినాడు.

కాసేపటికి లోపలి గొళ్ళెం తీసినట్లు శబ్దం అయింది. కాని ఎవరూ తలుపు తెరువలేదు. నేనే తలుపు నెట్టుకొని లోపలికి పోయినాను.

గదిలో ఎవ్వరూ లేరు ! కొండయ్య ఏమైపోయినట్లు ! ఎక్కడో సన్నని మూల్గుమాత్రం వినిపిస్తున్నది.'కొండయ్యా!' అని పిలిచినాను. 'ఆఁ ఆఁ'అని పలికినాడు. ఆ శబ్దం పైనుంచి వచ్చింది. తల ఎత్తి చూశాను.

కొండయ్య ఎక్కడున్నాడో చూసేసరికి నాకే ఆశ్చర్యం కలిగింది ! భయం వేసింది.

ఆయన డాబాకప్పును అతుక్కొని ఉన్నాడు బల్లిలాగ !

బెలూనును ఎగురవేస్తే అది ఎగిరి పోయి ఎల్లాగయితే కప్పును అతుక్కుని ఉంటుందో అల్లాగే ఉన్నాడు కొండయ్యా ఆ పై కప్పు అల్లాగ అడ్డం కాబట్టి బ్రతికి పోయినాడు కాని లేకపోతే అంతరిక్షంలోకి ఎగిరిపోయేవాడు అన్నమాట!

'ఏమిటయ్యా కొండయ్యా, ఇది?'

కొండయ్యా ఆ ప్రశ్నకు జవాబు ఏమీ చెప్పక నెత్తి, నెత్తి బాదుకున్నాడు. కంట నీరు పెట్టుకున్నాడు

కొండయ్యా ఉన్న స్థితి మొదట నాకు భయం వేసింది. గుండెలు దడదడ కొట్టుకున్నవి. ఏమీ తోచలేదు. మనుష్య ప్రవర్తన కాదది. నా కళ్ళు నేనే నమ్మలేకపోయినాను. పైకి ఎట్లా ఎగిరిపోయినాడు! అక్కడ ఏ ఆధారం లేకుండా ఎల్లాగ ఉన్నాడు! అంతా అగమ్యగోచరంగా ఉన్నది.

దయ్యం పట్టినవాళ్ళు ఇల్లాంటి అతి మానుషమైన పనులు చేస్తూ ఉంటారని ఎవరో చెప్పగా విన్నాను. ఈయనకే దయ్యం పట్టి ఉంటుంది! ఎటూ పాలుపోలేదు. నిర్ఘాంత పడినట్లు నిలువబడ్డవాణ్ణి, నిలువబడే ఉన్నాను.

కొంతసేపటికి 'ఏమిటిది?' అని మళ్ళీ అడిగితే ఆయన ఏమీ సమాధానం చెప్పలేక నెత్తి బాదుకొని జుట్టు పీక్కుని ఏడ్వడం సాగించినాడు.

నేను ఏదో ధైర్యం చెప్పవలె ఆయనకు. ఎట్లాగో ఓదార్చవలె. లేకపోతే ఆయన గతి ఏమైనట్లు!

ఇల్లాగ అనుకొనేసరికి, నాకు మొదట్లో కలిగిన భయం పోయింది. ఆయనగారి స్థితిని జూస్తే నవ్వు వచ్చింది.

అప్పటికి కొండయ్యాకూడా దుఃఖపు పొంగును అదుపు లోనికి తెచ్చుకొన్నాడు.

'ఏమిటిది ?'

'తేలిక అయి ఇట్లా అయినాను'.

'ఎప్పటినుండి ఈ స్థితి '?

'నిన్న రాత్రి అర్ధరాత్రి ఇక్కడకు వచ్చేశాను. తిండీ తిప్పలూ లేవు... ఏదైనా ఉపాయం ఆలోచించు' అని మళ్ళీ ఏడ్వడము సాగించినాడు.

నేను కుర్చీలో కూలబడి దీర్ఘంగా ఆలోచించినాను ఏమిటా ఉపాయమని ! ముందు ఆయనగారిని ఎట్లాగో క్రిందికి లాగి కాస్త ఏదైనా తినిపించడము అవసరమని తోచింది. మనిషి వడిలి తోటకూర కాడ అయిపోయినాడు.

'క్రిందికి రాలేవా ?' అని అడిగినాను

'ఎట్లా వచ్చేది. గాలికంటే తేలిక అయిపోయినాను. కప్పు అడ్డం లేకపోతే ఇంకా పైకి ఎగిరిపోయేవాణ్ణెమో అను కుంటూను!'

'ఏమి కర్మ వచ్చిందయ్యా కొండయ్యా !'

'ఆ మందు తింటే మనిషి తేలికఅవుతాడని మీ అత్త వ్రాసిపెట్టినా, ఇంత తేలిక అయిపోతానని, ఈ కర్మ పడుతుందనీ నేను అనుకోలేదు' అని అంటూ కొండయ్యా బావురుమన ఏడ్చాడు.

'అయితే ఇందాక తలుపు తీశావుకదా క్రిందికి ఎట్లా రా గలిగినావూ !'

గోడలు పట్టుకొని ఎట్లాగో నానా అవస్థ పడ్డాను. నూషలు పీకుతున్నవి. మళ్ళీ అవిధంగా రానూలేను, వచ్చినా ప్రయోజనమూ ఉండదు. ఎందుకంటే అల్లాగ చచ్చి చెడి వచ్చినా అక్కడ ఒక్క నిమిషంకూడా ఉండలేను. గాలి పైకి ఎగతన్నుతుందాయె' అని కొండయ్య పుట్టెడు దుఃఖాన్ని వెళ్ళబోసుకొన్నాడు.

ఈదభా నాకూ దుఃఖం వచ్చింది ఏమి చేసేది?

మళ్ళీ కుర్చీలో కూర్చుని ఆలోచిస్తూ. ఆ గది అంతా కలయ జూచినాను. పైనా క్రిందా అంతా ! పైన దూలానికి ఒకరింగు కనపడ్డది. ఎట్లాగయినా ఆయన క్రిందికి వచ్చే లాగున చెయ్యాలె.

## 5

ఒక నౌకరును పిలిచి నిచ్చెన ఒకటి తెప్పించి తాడు ఒకటి ఆ రింగులో దూర్చి క్రిందికి వ్రేలాడేశాము. 'ఆ తాడు పట్టుకొని క్రిందికి జారాలి. ఆ తరువాత ఆలోచిద్దాము' అన్నాను.

కొండయ్య బహు కష్టంమీద తాడు పట్టుకొని క్రిందికి రా సాగినాడు. ఎక్కడన్నా కాస్త పట్టు వదిలితే సరి రివ్వున ఎగిరిపోయేవాడు.

నేనూ నారూ కుర్చీలమీదికెక్కి నుంచుని, కొండయ్యను రెక్కపట్టుకొని ఆ తాడు వెంటనే క్రిందికి దిగడానికి సాయ పడ్డాము.

ఎట్లాగయితే నేమి ఆయనను కుర్చీలో కూర్చోబెట్టి చెరో భుజం పట్టుకొని అదిమితే అతడు కుర్చీలో కూర్చో గలిగినాడు మేము మా చేతులు ఎత్తివేశామా, అతడు రివ్వున గాలి పటములాగ పైకి ఎగిరిపొయ్యేలాగు ఉన్నాడు.

అతనిని కూర్చోబెట్టి భోజనము తినిపించడమువెట్లాగో!

ఇంటిప్రక్కనఉన్న ఫ్యాక్టరీలోకి వెళ్ళి రెండు మణుగుల రాళ్ళు తెప్పించి వాటికి త్రాళ్ళుగట్టి ఆ త్రాళ్లు, కొండయ్య చంకల క్రిందుగా పైకి లాగి, భుజాలపైన ముడివేశాము. ఆ బరువు క్రిందికి లాగాతూ ఉండడమువల్ల ఆయనగారు ఎగిరి పోకుండా ఉండడము సాధ్యమైనది.

సరే ఎల్లాగో కూర్చోబెట్టినాము. కాస్త అన్నము తిన్నాడు. ఒక సిగరెట్టుకూడా కాల్చి తృప్తిపడ్డాడు.

కాని భుజాలక్రింద బరువులు కట్టడమువలన ఆయన కేదో బాధ కలిగింది.బుజాలు పీకినవట ! ఆ బాధ భరించలేక 'ఇదేమీ బాగుండలేదబ్బా! నన్నువదిలేశెయ్యండి. ఇంతకంటే ఆపైన అతుక్కొని ఉండడమే సుఖంగా ఉన్నది. బాబోయ్ ఈ బాధ భరించలేను.' అని గోల పెట్టడము సాగించినాడు. సరేనని ఆ త్రాళ్ళు తొలగించేసరికి కొండయ్య దూది పింజ లాగ ఎగిరిపోయి దూలానికి అతుక్కున్నాడు.

గుడ్డిలో మెల్ల ఏమిటీ అంటే ఆ స్థితిలో ఉండే కొండయ్య సిగరెట్టు కాల్చుకునేవాడు.

దాని తరువాత ఏమి చెయ్యాలె అన్నది పెద్ద సమస్య అయిపోయింది. వైద్యులు ఏమీ చేయలేరు. ఈ మళయాళపు మందులకు విరుగుడు అంటూ ఏమీ లేదు. ఇదెక్కడి కర్మరా! దిగులుపడి కూర్చున్నాము.

అతణ్ణి అల్లాగ నిరాధారంగా అంతరిక్షంలోనే ఉండనిచ్చి, ఫలాహారము కాఫీ అందిచ్చాము ఆ మధ్యాహ్నము. కాని ఎన్నాళ్ళని ఇల్లాగ!

అనేకమంది ఆయనతో పని ఉండి వస్తున్నారు. అయితే మేము ఎవ్వరినీ లోపలకు రానీయక ఆయనకు జబ్బుగా ఉన్నదని చెప్పి పంపిస్తూ ఉన్నాము.

ఈ విచిత్ర సంఘటనను గురించి ఇతరులకు ఏమాత్రము తెలియకుండా ఉండాలని మేము శాయశక్తులా ప్రయత్నించాము. కాని ఎట్లాగో పొక్కింది కొందరికి ఈ విషయము చూచాయగా తెలిసింది. కొంతమంది డాక్టర్లు వచ్చి 'కొండయ్యకు ఏమిటి జబ్బు! ఎట్లాగున్నది పెద్ద పెద్ద పరీక్షలు ప్యాసు అయిన వాళ్ళము. డాక్టర్లము ఇంతమందిమి ఆయనకు స్నేహితులముగా ఉన్నాముకదా, మాకు సంగతేమిటో చెప్పరేమి?' అని నిష్ఠురోక్తులు ఆడడము మొదలుపెట్టినారు.

డాక్టర్లతో ఈ విషయము చెపుతానంటే 'వద్దుబాబో వద్దు. వాళ్ళతో చెబితే నేను ఉరిబోసుకు చస్తాను' అన్నాడు కొండయ్య.

నాకు నవ్వొచ్చింది. ఆయన ఉరిబోసుకున్నా చావడు. ఎందుకూ అంటే మనిషి శరీరం బరువై క్రిందికి లాగితేగదా

మెడకు వేసుకొన్న ఉరి బిగియడము. అల్లాగ చావాలన్నా ఆయన చావలేదు. ఆయన చచ్చినట్లు బ్రతికుండక తప్పదు.

ఆయనగారు వద్దు వద్దు అంటూఉన్నా వినక, ఆ డాక్టర్లు అందరిలోనూ, వృద్ధుడూ, సమర్థుడూ, మిక్కిలి యోగ్యుడూ అయినటువంటి ఒకాయనను పిలిచి, 'ఇట్లా వచ్చింది ఏమి చేద్దాం' అన్నాను. అయితే ఆయనను లోపలికి మాత్రము తీసుకొని వెళ్ళలేదు. 'అసలే కొండయ్య సిగ్గుపడి చస్తున్నాడు ఆయనను ప్రత్యక్షంగా చూడవద్దు' అని సవినయంగా డాక్టరుగారికి బోధ పరిచినాను.

ఆయనకూడా తల చేతులలో పెట్టుకొని చాలాసేపు విచారగ్రస్థుడై ఆలోచన చేసినాడు. ఇదేమైనా జబ్బుఅయితే ఆయన ఇంతగా ఆలోచించవలసిన పనిలేక పొయ్యేది! టైఫాయిడ్ జ్వరం అయినా అయితే ఎంతో బాగుండేది! బరువు తగ్గడమూ, మనిషి తేలికఅయి ఎగిరి పోవడమూ, ఎప్పుడూ కనీ, విని, ఎఱుగని విషయము!

ఆలోచించి, ఆలోచించి 'ఈ సంగతి బ్రిటిష్ మెడికల్ కౌన్సిలుకు వ్రాస్తేనో!' అన్నాడు.

అల్లాగ వ్రాస్తే ఇంకేమైనా ఉందా! దేశ దేశాలనుంచి వచ్చి పడరూ, ఈ విచిత్రము చూడడానికి!

కొండయ్య నవ్వుల పాలై పోతాడు. ఈ విషయం చచ్చినా ఎవ్వరికీ తెలియనీయవద్దని కొండయ్య నన్ను శాసించినాడు.

ఆ డాక్టరుగారు ఏమీ చెయ్యలేక వెళ్ళిపోయినాడు.

కొండయ్య హఠయోగం అభ్యాసంచేసి ఈ విధంగా ఆకాశంలోకి ఎగిరే శక్తిని సంపాదించినాడని కొందరన్నారు. అయితే హఠయోగాభ్యాసంవలన భూమికి జానెడు ఎత్తు పైకి లేవడము ఉండటగాని, ఇల్లాగ ఆకాశంలోకి లేచి పోవడము ఎక్కడా లేదని మళ్ళీ వాళ్ళే అన్నారు.

కొన్ని రోజులనుంచీ కొండయ్య ఏదో క్షుద్ర దేవతను ఆరాధిస్తూ ఉన్నాడనీ, ఆ దేవతను ఉపాసన చేయడములో ఏదో అకృత్యము జరిగి, తత్ఫలితంగా ఈ వైపరీత్యం పుట్టిం దని కొందరన్నారు.

ఎవరో సిద్ధుడు వచ్చి పాదలేపనము ఇచ్చిపోయినాడని, దానికి ఫలితంగా ఆకాశగమన శక్తి ఆయనకు వచ్చిందనీ, వదిలిపెడితే ఆయన దూర దూర దేశాలకు వెళ్ళి వస్తాడని మరికొందరు అన్నారు

ఇల్లాగ ఒక్కొక్కరు ఒక్కొక్కవిధంగా వ్యాఖ్యానము చేసినారు.

కాలం ఏదో విధంగా గడిచిపోతున్నది. కాని రాత్రిళ్లు నిద్రపోవటానికి ఏ మాత్రమూ వీలుపడకుండా వచ్చింది. రెండు మూడు రోజులు నిద్ర లేకుండానే ఉన్నాడు.

మూడోనాడు మాత్రము "బాబూ మీరునాకు నిద్ర పోయే ఏర్పాటు ఏదైనా కల్పించాలి. అల్లాంటి ఉపాయము ఏదో చూడక పోతే నా ప్రాణాలు నిలువవు. ఇక బ్రతకడము కూడా కష్టము" అని గోలపెట్టినాడు

అతని మిత్రులమైన మేము ఈ విషయమై గట్టిగా ఆలోచించినాము. ఒక ఏర్పాటు చేసినాము. కొండయ్యను

క్రిందకు లాగి మంచంమీద పడుకోబెట్టి పైన రజాయీలు కప్పి, తాళ్ళతో బిగతీశాము. దానితో కట్టబడి లేవకుండా ఉండి పోవడమే కాకుండా, హాయిగా నిద్రకూడా పోయినాడు.

కొండయ్య ఒప్పుకోవాలెగాని, ఈ దెబ్బతో అతడు ప్రపంచ విఖ్యాతిని సంపాదించుకోగలిగిన స్థితిలోకి వచ్చినాడు. అతని నడుముకు ఒక తాడు గట్టి గాలిపటములాగ ఎగురవేయ వచ్చు. ఆ ఎత్తున వాతావరణస్థితి ఎల్లాగున్నదో అతని ముఖతా వినవచ్చు. కాని అతడు అసలే సిగ్గుపడి చస్తూఉంటే! వీటి కన్నిటికి ఎల్లాగ అంగీకరిస్తాడు!

ఆయనను బయటకు తీసుకొనివచ్చి గాలిలో వదిలివేస్తే ఏమిజరుగుతుందో చూడవలసిన విషయమే. గాలిఎటువీస్తే అటు కొట్టుకుపోతాడని తోస్తుంది.

అల్లాగ స్వేచ్ఛగా వదిలేస్తే ఆయన తన గమనాన్ని ఒక నిర్ణీతపథానికి మరలించి, దూరదేశాలు చూచి రాగలుగు తాడేమో! కాని ఈ విషయాలు మా ఆలోచనలే కాని కొండయ్యతో చెప్పడానికి మేము ఎవ్వరమూ సాహసించలేక పోయినాము: చెప్పినా ఆయన ఆమోదించే వాడుకాదు. మేము తనను ఆటవస్తువుగా వాడుకోనడము ఆయనకు ఎల్లాగ ప్రమోదజనకము అవుతుందీ!

ఆ గదిలో గోడలకు గజానికి రెండు గజాలకు ఒకటి చొప్పున పెద్ద పెద్ద మేకులు బిగించినాము. వానిని పట్టుకొని కొండయ్య కాస్త అటూ, ఇటూ, ఆ గోడల వెంటా, దూలాల వెంటా తిరగటానికి వీలు అయింది. దానివలన ఆయనకు కొంచెము సుఖంగా ఉన్నదని చెప్పినాడు.

కొంతకాలము పోయినతరువాత ఆయన డైవరు లు మొదలైనవారితో మాట్లాడి వ్యవహారాలు పరిష్కారం చేసికోవలసిన అగత్యం కలిగింది. అల్లాగ చెయ్యకపోతే ఎన్నో వ్యవహారాలలో ఆయనకు నష్టం రాక తప్పదు కాబట్టి ఏదో ఏర్పాటుచేసి, ఇతరులు ఆయనతో మాట్లాడడానికి సదుపాయం చెయ్యాలె

ఆయనను మంచంపైన పడుకోమని కాళ్ళదగ్గర నడుందగ్గర త్రాళ్ళతో మనిషిని మంచానికి కట్టివేశాము. పైన దుప్పటి కప్పినాము. చెమట పోయకుండా పైన ఫాన్ గిఱ్ఱున తిరుగుతునే ఉండె! ఆ స్థితిలో ఆయన చూడవలసిన వాళ్ళను చూచి ఎన్నో వ్యవహారాలు పరిష్కారం చేసుకొన్నాడు.

ఎప్పుడూ పడుకొని ఉంటే నరాలుబిగిసిపోతవని మధ్యమధ్య కట్లు విప్పి ఆయనను వదిలేవాళ్ళము ఆ సమయంలో ఆయన పైకి ఎగిరి దూలాన్ని అంటుకొని కాసేపూ, గోడల వెంట పాకి మరికొంతసేపూ కాలక్షేపం చేసేవాడు. తరువాత ఆయనను క్రిందికి లాగి త్రాళ్ళతో బిగించి పైన సన్నని దుప్పటి కప్పి పడుకోబెట్టేవాళ్ళము.

కొన్ని నెలలు గడిచిపోయినవి. కొండయ్యకు ఈజీవితం ఒక విధంగా అలవాటు అయింది. కాని ఎన్నాళ్ళని ఇల్లాగ! మళ్ళీ యథాప్రకారం వీధిలోకి వెళ్ళి తిరగడము ఎప్పుడూ!

ఆలోచిస్తే దానికీ ఒక ఉపాయం తోచింది ఎంత బరువు అతని శరీరంపైన ఉంటే అతడు భూమిని అంటిపెట్టుకొని ఉంటాడు, పైకి ఎగురకుండా! ఈ సమస్యను పరిష్కారం చేస్తే కొండయ్య మామూలుగా తిరుగవచ్చు.

ఒకరోజున ఆయనను భూమిమీద నిలువబెట్టి, కోటు అపి తొడిగి, ఆయన జేబుల్లో ఇటుపక్కన ఒక వీసె రాయి, అటుపక్కన ఒక వీసెరాయి వేశాము. మనిషి నిలబడి పోయి నాడు ఎగిరిపోలేదు ఆహా ఇదిరా ఉపాయం అనుకున్నాము.

కొండయ్య మామూలుగా దుస్తులు వేసుకొని కోటు జేబులలో ఈ రాళ్ళు వేసుకొన్నదాకా పట్టుకొంటే ఆ తరు వాత అతడు మామూలుగా అందరిలాగే నడిచి వెళ్ళగలిగే వాడు. కాని అంతవరకు అతనిని ఇద్దరు ముగ్గురు అదిమి పట్టు కోవాలి

దాని తరువాత మరొక ఉపాయం తోచడమువలన అల్లాగే మనిషిని అదిమి పట్టుకోవలసిన అవసరంకూడా పోయింది.

అడుగున, సుమారు వీసె బరువుగల సీసపు రేకులను బిగించిన ఒక క్రొత్తరకపు బూడ్సులు తయారుచేసి అవి తొడు క్కోమన్నాము. ఆ బరువుకు అతడు భూమిమీదనుంచి లేవడము మానేశాడు. అందరివలెనే నడచి, వ్యవహారాలు చక్క బెట్టుకో గలిగినాడు దానితో మాకు అతనివిషయమై వచ్చిన సమస్యే తీరిపోయింది.

అల్లాగ తయారుచేసిన బూడ్సులు రెండుజతలుఉన్నవి. హాయిగా కాలం గడిచిపోతున్నది

కొన్నాళ్ళు పోయినతరువాత సరదాకు, ఇంకొకరకము జత తయారు చేయించినాము. ఆ బూడ్సులలో ఒకొక్క దాని అడుగున అరవీసె బరువుగల సీసముమాత్రమే ఉంటుంది. ఈ బూట్సు వేసుకొన్నప్పుడు అతడు భూమిమీద నిలువబడి,

నిలువబడనట్లు ఉంటాడు. బరువూ, వత్తిడీ ఏమాత్రమూ భూమిమీైన పడదు. ఈ పాదరక్షలు తొడుక్కొని అతడు పరుగెత్తగలడు. అల్లాగ పరుగెత్తుతూ ఉన్నపుడు ఆయన కాళ్ళు భూమిపైన ఆనీ, ఆనకుండా ఉంటవి. బహు సునాయాసంగా, వేగంగా పరుగెత్తగలడు. అంత స్థూలకాయుడు అంత సునాయాసంగా పరుగెత్త గలిగి ఉండడము బహు విచిత్రమైన విషయం కదా!

కొండయ్య ఇప్పుడు సుఖంగానూ నిర్విచారంగానూ జీవించగలుగుతున్నాడు. ఒకసారి ఒకమైలు పరుగుపందెంలో అతడు ప్రథముడుగా రావడము ప్రపంచాన్ని అంతా విస్మయ సంభ్రమములతో ముంచెత్తి వేసింది.

కాలం గడిచినకొద్దీ అతడు తన నూతనజీవితాన్ని మరీ సుఖవంతము, విలాస పరిపుల్లమూ అయ్యేలాగున చేసుకొంటున్నాడు.

—o—

# గాలి దేవుడు

గాలిదేవుడు మన కళ్ళకు కనిపించడు. ఆయన ఆకాశంలో ఎక్కడో ఉంటాడు. అయితే గాలి మనకు ఎట్లా వస్తుందో తెలుసా !

గాలిదేవుడు ఎక్కడో తన మేడలో కూర్చుని 'ఉఫ్, ఉఫ్' అని ఊదుతూ ఉంటాడు. అల్లాగ ఊదడంవల్ల వచ్చే గాలే మనకు వస్తూ ఉంటుంది.

ఆయన ఎక్కడ ఉంటాడో మనకు సరిగ్గా తెలియదు గాని ఆకాశంలో ఎక్కడో చక్కని మేడలో ఉంటాడనీ, అక్కడనుంచే గాలిని మనకు పంపిస్తూ ఉంటాడని అందరూ అంటారు

ఆ మేడ మన మేడల్లాగ ఇటుకలతో కట్టింది కాదు. ఇటుకలతో కడితే ఆకాశంలో ఎట్లా నిలుస్తుంది! ఆ మేడను మబ్బులతో కట్టారు. దట్టమైన నల్లని మేఘాలను తీసుకొని వచ్చి వానిని ఒకదానిపై ఒకటి పేర్చి ఆ మేడకు గోడలుగా అమర్చారు. మరికొన్ని మేఘాలను కప్పుగా అమర్చినారు. అది ఎంత విచిత్రమైన మేడో చూడండి

ఆ మబ్బు మేడలో గాలిదేవుడు తన భార్యతోనూ, పిల్లలతోనూ హాయిగా ఉంటాడు.

ఆ యింట్లో ఎన్నో విశాలమైన గదులు ఉన్నాయి. ఆ గదులలో మబ్బు తునకలను ఒకదానిపై ఒకటి పేర్చినారు. ఆ విధంగా ఏర్పడ్డ మబ్బు గుట్టలపైన గాలిదేవుడూ, పిల్లలూ పడుకుంటారు. అవే వాళ్ళకు మెత్తని పరుపులు.

సాయంత్రంపూట గాలిదేవుడు ఆకాశంలో షికారుకై బయలుదేరుతాడు. ఆయన ఒక మాంచి మేఘముపై కూర్చుని నోటితో కాస్త ఉఫ్ అన్నాడా అంటే ఆ మేఘం ఆకాశంలో నడవడము సాగిస్తుంది.

ఆయన ఒక తమాషా చేస్తాడు. తాను ఎక్కిన మేఘాన్ని ఒక గుఱ్ఱాగానో ఏనుగానో తయారు చేస్తాడు. అది ఆయనకు ఏమంత కష్టమైన పని కాదు. గాలిదేవుడు ఒక పెద్ద మేఘం దగ్గరికెళ్ళి ఉఫ్-అని ఊదితే ఆ మేఘం ఒక గుఱ్ఱం ఆకారంలోకి వస్తుంది. ఆ ఆకారంలో ఎక్కడన్నా లోపం ఉంటే గాలిదేవుడు ఇంకా రెండుసార్లు అక్కడక్కడ ఊది ఆ వంకర టింకరలన్నీ పోగొట్టి ఆ మేఘాన్ని ఒక చక్కని గుఱ్ఱంగా తీర్చి దిద్దగలడు. ఇల్లాగ మేఘాలను తన యిష్టంవచ్చిన ఆకారంలోకి మారుస్తూఉంటాడు ఒకరోజున గుఱ్ఱాన్ని చేస్తాడు. ఒకరోజున ఏనుగను చేస్తాడు. మరోరోజున ఒంటెను చేస్తాడు. ఇల్లాగ మేఘాలను తన ఇష్టమువచ్చిన ఆకారంలోనికి మార్చి వాటిపై ఎక్కి స్వారీ చేస్తూఉంటాడు. ఒక్కొక్క రోజున పది పదిహేను గుఱ్ఱాలు తన వెంట వస్తున్నట్లు మేఘులను తయారు చేస్తాడు. వాటిపైన గాలిదేవుడూ, పిల్లలూ, ఆయన స్నేహితులూ అంతా ఎక్కి స్వారి చేస్తుంటారు.

అస్తమిస్తున్న సూర్యకాంతి ఈ మబ్బులపై పడడం మూలాన రంగు రంగుల గుఱ్ఱాలనూ ఏనుగులనూ ఎక్కి వాళ్ళంతా స్వారి చేస్తున్నట్లు మనకు కనపడుతుంది. అయితే వెన్నెల రాత్రిళ్ళల్లో అవన్నీ తెల్లగానే కనిపిస్తవి.

గాలిదేవుడికి నిడుపైన గడ్డం ఉంది. అది క్రిందికి వేలాడుతూ ఉంటుంది. అది అటూ-ఇటూ ఊగుతూఉంటుంది ఆ గడ్డం భూమిని తాకుతూ ఉండేతంతటి పొడుగ్గా ఉంటుంది ఆయన గడ్డం ఎంత పొడుగో, తలపైన ఉన్న వెంట్రుకలు కూడా అంతే పొడుగు వాయుదేవుడు మేఘాలపైన ఎక్కి స్వారి చేస్తుంటే వెనక రెండు గజాలలెక్క ఆయన జుట్టు గాలిలో ఎగురుతూ ఉంటుంది. సాయంత్రం సమయంలో సముద్రపు ఒడ్డునగాని ఊరిబైట మైదానంలోగాని కూర్చుని ఆకాశంలోకి చూస్తే, మబ్బులపై స్వారి చేస్తున్న గాలిదేవుణ్ణి ఆయన పిల్లలనూ, మనముచూడవచ్చు. గాలిదేవుడుఎప్పుడూ నవ్వుతూ ఉంటాడు ఆయన ముఖము మందహాస సుందరము.

గాలిదేవుడూ ఆయన భార్యా పిల్లలూ ఏమి తింటారో మీకు తెలుసునా! ఆకాశంలో పాలపుంత అని ఒకటిఉన్నది. అది ఒక నది. ఆ ప్రవాహంలో ఎప్పుడూ పాలు ప్రవహిస్తూ ఉంటవి. గాలిదేవుడూ, ఆయన భార్యా, పిల్లలూ, ఈ పాల పుంతలో ఉన్న పాలనే తెచ్చుకొని త్రాగుతారు. అదిగాక వెన్నెలలో ఉండే అమృతంకూడ ఆయన తాగుతాడు. అమృతం తాగితే ఆకలి దప్పులు ఉండవు. తెలుసుగా!

గాలిదేవుడుగారి యింట్లో దీపాలు ఏమిటో తెలుసా! ఆకాశంలో ఉన్న నక్షత్రాలను కొన్నిటిని ఒలిచి ఆయన తన

యింట్లో పెట్టుకొన్నాడు. ఆ నక్షత్రాలు తళుకు తళుకు మంటూ ఆ ఇంటికి కావలసిన వెలుగునంతా ఇస్తవి

గాలిదేవుడికి ఆయన భార్యా పిల్లలకు కావలసిన బట్టలు ఎట్లా వస్తవి అనుకొన్నారు? ఉదయమూ సాయంత్రమూ, ఆకాశంలో రంగురంగుల మబ్బులు ఉంటవి. ఈ మబ్బులలో నుంచి తనకు కావలసిన ముక్కలను తీసుకుపోతాడు ఆ గాలి దేవుడు. ఆ మబ్బు తునకలు మనోహరమైన రంగులలో ఉంటవి. వానినే గాలిదేవుడూ పిల్లలూ అంతా ధరిస్తారు.

గాలిదేవుడు ప్రతిరోజూ సాయంత్రంపూట చల్లగాలిలో గుఱ్ఱాలపైన ఎక్కి స్వారిచేస్తూ ఉంటాడని చెప్పానుగాకూ! అయితే ఆయన ఒక్కొక్కరోజు బద్ధకించి రాలేక ఆడవాళ్ళను పిలిచి 'మీరు పొండట్టా ఇవ్వాళ్ళకు' అని వాళ్ళను పంపిస్తాడు. శ్రీకృష్ణుడు రేపల్లెవాడలో జన్మించాడని విని యాదవ పేరంటాండ్రు అంతా వెళుతూ ఉన్నట్లు, ఈ మబ్బుకన్యలు రంగు రంగుల చీరలను ధరించి ఆకాశమార్గాన నడువలేక నడుస్తున్నట్లు కనపడే ఆ దృశ్యం మిక్కిలి మనోహరంగా ఉంటుంది.

మనకు ఊహించుకొనే శక్తి ఉండాలె. ఉంటే ఎన్ని విచిత్రాలైనా చూడవచ్చు ఆకాశంలో. ఎన్నో రకాల బొమ్మలు కనిపిస్తాయి గాలిదేవుడే ఈ చిత్రాల నన్నింటిని నిర్మిస్తాడు.

ఒకప్పుడు శ్రీ సీతా రామ లక్ష్మణులు పడవలో ఎక్కి సరయూ నదిని దాటుతూ ఉన్నట్లు ఒక దృశ్యం కనపడుతుంది క్షణంలో అది చెరిగిపోతుంది. అశోక వృక్షం క్రింద దీనవద

సంలో కూర్చున్న సీతమ్మవారు కనపడుతుంది అది పోయి మరో చిత్రం కనపడుతుంది. ఇల్లాగ ఒకటి తరువాత ఒకటిగా చిత్ర విచిత్రమైన దృశ్యాలు కనపడతవి. ఇవన్నీ గాలిదేవుడే నిర్మించి, వానిని చూచి ఆనందిస్తూ ఉంటాడు. రామాయణ కథలూ, భారత కథలూ ఆయన ఆకాశవీధిలో చిత్రాలుగా చిత్రిస్తాడు

ప్రపంచంలో నలుదిక్కులకూ ప్రవహించేలాగున గాలిని ఊదడమే గాలిదేవుడు చేసేపని. పాపము ఈ పని చాలా కష్టమైనదే. ఆయన ఏ కారణంచేతనైన కాసేపు ఈ ఊదడం మానివేశాడా మనం అంతా గాలిలేక గిలగిల్లాడిపోతాము. ఉమ్మగా ఉంది, ఉక్కపోస్తున్నది అని గోల పెడతాము.

ఆయనకు విసుగు పుట్టినప్పుడు "ఎప్పుడూ గాలిఊద లేక చచ్చిపోతున్నానస్టా" అని విసుక్కొని ఒక్కసారి పెద్దగా నిట్టూర్పు ప్రళయ ఝంఝువుగా మారి భూమినీ, నీటినీ, చుట్ట బెడుతుంది. ఎత్తయిన వృక్షాలుకూడా ఈ ఝంఝువు ధాటికి ఆగలేక పెళపెళామని విరిగి పడిపోతవి. సముద్రంలో బ్రహ్మాండమైన అలలులేస్తవి రాక్షసులూ, దేవతలూ, అమృతంకోసం సముద్ర మధనం చేసినప్పుడు, ఎంత భయంకరంగా, జలనిధి కల్లోల పడ్డదో అంత కల్లోల పడుతుంది సముద్రం అటువంటి సమయంలో అప్పుడు సముద్రపు టలలు పడగలు విప్పి నాట్యం చేసే కోడె త్రాచులలాగ లేస్తవి. సముద్రంలో ఉండే తిమింగలాలూ పెద్ద పెద్ద చేపలూ అన్నీ తల్లడిల్లిపోతవి. ...యితే గాలి దేవుడు అంత భీభత్సాన్ని కలుగ జేసే నిట్టూర్పు

ఎప్పుడూ విడవడు. ఎప్పుడో మరీ చికాకు కలిగినప్పుడు ఈ అల్లరిఅంతా జరుగుతుంది.

కోపం వచ్చినపుడు చూడాలె గాలిదేవుణ్ణి. ఆయన భయంకరమూర్తి అయిపోతాడు. జుట్టుఅంతా పైకి నిక్క పొడుచుకొంటుంది. ఆయన కళ్ళు తళతళమని మెరుస్తవి. ఆ తళతళలనే మనము మెరుపు అంటాము. అటువంటి సమయంలో కోపం వచ్చి కేకలు వేస్తే అవి మనకు భయంకరంగా వినిపిస్తవి. వాటినే మనము ఉరుములు అంటాము

ఈ మెరుపులూ ఉరుములూ రావడంతోనే ఇంద్రుడు ఎక్కడెక్కడి మేఘాలనుతీసికొచ్చి వాటిచేత వర్షం కురిపిస్తాడు. మేఘాలు ఇచ్చిన వర్షజలంవల్ల గాలిదేవుడు ఒళ్ళు చల్లబడుతుంది. అప్పుడు ఆయన శాంతిస్తాడు. ఇదంతా ఆయనకు కోపం వచ్చినపుడు జరిగే సంగతి. సాధారణంగా ఆయన శాంతంగానే ఉండి తనపని తాను చూచుకొంటూ ఉంటాడు.

గాలిదేవుడికి పిల్లలంటే ఎక్కువ ఇష్టం. పిల్లలు గాలిపటాలు ఎగరవేస్తే వాటిని పైకి తీసుకొనివెళ్ళి ఆడిస్తాడు. ఇది చూచి వాళ్ళు సంతోషంతో ఎగురుతూఉంటే, గాలిదేవుడు కూడా ఎంతో ఆనందిస్తాడు. మరికొన్ని సమయాలలో సముద్రంలో ప్రయాణం చేసే పడవలను ఇటూ - అటూ ఉయ్యాల లూపి, నావికులంతా భయపడుతూ ఉంటే చూచి ముసి ముసి నవ్వులు నవ్వుకొంటాడు ఆ గాలిదేవుడు.

గాలిదేవుడి పిల్లలు వట్టి అల్లరివాళ్ళు ... అప్పుడప్పుడు, వాళ్ళుకూడా గాలిని ఊదుతూ ఉంటారు. పిల్లలు ఊదే గాలులనే మనము పిల్లగాలులు అంటాము. వీధిలో నడుస్తున్న మను

ష్కూల టోపీలను ఎగరగొట్టడమూ, ఉత్తరీయాలను ఎత్తుకు పోయి దూరంగా విసిరి పారవేయడమూ ఎవరన్నా గొడుగు వేసుకు వెడుతూఉంటే ఆ గొడుగును తల్లక్రిందు చేయడమూ, ఆడపిల్లల పమిటలనూ, లంగాలనూ ఎగరగొట్టడమూ ఇవి ఆ తుంటరిపిల్లలు చేసే పనులు.

ఇంట్లో పసిపిల్లలు నిద్రపోతూఉంటే ఈ గాలి పిల్లలు కిటికీగుండా వచ్చి, వాళ్ళ ముంగురులను సవరించి బుగ్గలను ముద్దాడి పోతారు.

దేవాలయాలలో ధ్వజస్తంభాలు వుంటవి. ఆ సంభాలు చాలా ఎత్తుగా వుంటవి ఆ స్తంభం చివరను చిరుగంటలు వుంటవి. అప్పుడప్పుడు ఆ గంటలను గణ గణా వాయించడం ఈ పిల్లలుచేసే అల్లరి పనులలో ముఖ్యమైనది... ఆ గంటలు తమాషాగా మ్రోగుతూవుంటే మన గాలి పిల్లలు కిల కిలా నవ్వుకొంటారు.

ఒకాయన ఏదో వార్తాపత్రిక చదువుకొంటూ వీధిలో నడుస్తున్నాడు. గాలిపిల్లలు చూశారు, తమాషా చేద్దామంటే చేద్దామనిఅనుకొన్నారు. ఇంకేముంది. వాళ్ళంతా ఆయనపై విరుచుకుపడ్డారు. ఆ కాగితాలు రెప రెప కొట్టుకొన్నవి. ఈ గాలిపిల్లలలో ఒకడు ఆ పేపరును ఎగరగొట్టుకు వెళ్ళి దూరంగా వున్న మురికి గుంటలోకి విసిరికొట్టాడు... పాపం ఆ ముసలాయన ఒకటే గోల తాను అణాపెట్టి కొనుక్కున్న పేపరు పోయిందోనని ! ఆయన బిక్కముఖంతో వెళ్ళిపోతూ వుంటే ఆ పిల్లలు పకపకా నవ్వుకొన్నారు.

ఒకసారి ఇంకో తమాషా జరిగింది. రైలు బండి వేగంగా వెళుతున్నది. గాలి పిల్లలు, ఆ బండికి అడ్డం పోయి 'ఎందుకా తొందర కాస్త ఆగవమ్మా ఆగు' అన్నారు ఇంజనుతో. ఇంజనంటే ఏమనుకొన్నారో ఇంజను ఎంత పెద్దది! ఎంత బలమైనది-ఏమిటి సంగతి!

ఆగు అంటే తాను ఆగిపోవటమే ఎంత అప్రతిష్ట! ఇంజనుకు. అందులో తాను ఏమన్నా మామూలు రైలు ఇంజను గనుకనా! తాను మెయిల్ ఇంజను! మెయిలుబండి ఇంజను ఏమిటి, ఈ కుఱ్ఱకుంకలు ఆగమంటే ఆగడమేమిటి!

ఇంజనుకు కోపం వచ్చేసింది. బుస్సుమంది. కస్సుమంది ఈ కస్సు బుస్సులకు గాలిపిల్లలు భయపడి పారిపోతారు. అనుకొంది. వాళ్ళు వెళ్ళిపోక పొయ్యేసరికి మెయిల్ ఇంజనుకు మరీ కోపం వచ్చి, మీ ఆటలు నాదగ్గర సాగవు. పొండర్రా పోండి!! అని కేకేసి ముందుకు తోసుకుపోయింది.

ఇంజను తమ మాట వినకపోయేసరికి గాలిపిల్లలకు మరీ కోపం వచ్చింది. వాళ్ళంతా వాళ్ళ నాన్నదగ్గరకు పోయి ఈ సంగతి అంతా ఆ ముసలాయనకు చెప్పారు.

'ఏమిటేమిటి! అంత పొగరా దానికి నేను వస్తానుండు, అని చెప్పి ఆయన బయలుదేరి వచ్చి 'ఆగు కదిలావంటే జాగ్రత్త' అన్నాడు ఇంజనుతో.

ఎంత మెయిల్ ఇంజను అయితేమటుకు గాలిదేవుడుతో పోట్లాడే శక్తి దాని కెక్కడిది! గాలి దెబ్బకు తట్టుకోలేక అంత ఇంజను ఠాక్కున ఆగిపోయింది. ముందుకు ఒక్క అడుగైనా వెయ్యలేకపోయింది.

'అయిందా, అమ్మగారి పని!' అని గాలిపిల్లలు వెక్కిరింతగా అన్నారు. ఇంజను పాపం ముఖం ఇంత జేసుకొని 'మీ నాన్నగారు వస్తారనుకోలేదు. పొరపాటే అయిందర్రా' అని ఇంజను క్షమాపణ చెప్పుకొన్నది. గాలిదేవుడుకూడా శాంతించి ముందుకు పోవడానికి ఇంజనుకు అనుజ్ఞ ఇచ్చాడు. ఇంతకథ జరిగింది.

ఈ గాలిపిల్లలు చేసే అల్లరి ఇంతా అంతా కాదు. ఒకసారి పదిమంది పిల్లలు ఒక మామిడి తోపులోనికి పోయినారు. చెట్లపైన చిన్న చిన్న మామిడిపిందెలున్నవి. అవి కోసుకొని వుప్పు అద్దుకొని తింటే ఎట్లాగ ఆ పిందెలను కోసుకోవడం? ఆ పిల్లలు చెట్లు ఎక్కగలరా ఏమన్నానా!

వాళ్ళంతా ఎట్లాగా మామిడిపిందెలు కోసుకోవడమూ అని చాలాసేపు ఆలోచించినా వాళ్ళకేమీ వుపాయం తోచలేదు. అందుకని బిక్కముఖాలు వేసుకొని నించున్నారు.

గాలిపిల్లలలో ఒకడు ఈ పిల్లల సంగతి కనిపెట్టి పాపం ఆ పిల్లలకు సాయం చేద్దామర్రా అన్నాడు తన అన్న తమ్ములతో వాళ్ళంతా సరేఅంటే సరే అన్నారు ఇంకా ముందు వాళ్ళంతా ఆ చెట్లపై బడి పిల్లలకు కావలసినన్ని మామిడి పిందెలను రాల్చినారు పిల్లలు సంతోషించారు.

'ఇంకోసంగతి చూశారు! ఆ గాలిపిల్లలు ఎంత బుద్ధిమంతులో! ఆ మామిడిపిందెలు అన్ని రాల్చలేదు. అన్ని రాల్చేస్తే తోటమాలికి నష్టం అని వాళ్ళకు తెలుసు చూశారా? గాలిపిల్లలు ఎంత చిలిపివాళ్లు అయినా వాళ్ళకు కాస్త మంచి చెడ్డా తెలుసు మాన మర్యాదలు తెలుసు! ఈ గాలి

పిల్లలు పెద్దవాళ్ళ జోలికి పోరు. పిల్లలతోనే ఆడుకుంటారు.

గాలిపిల్లలు అల్లరిచూచి ముసలాయన తనలో తాను నవ్వుకొంటాడేగాని వాళ్ళ నేమీ అనడు.

# పలుకు రాణి కథ

భూదేవి గాలిదేవుణ్ని పెళ్లి చేసుకున్నది. అది ఇప్పటి సంగతి కాదు. ప్రపంచం పుట్టిన మొదటిరోజులలో ఆ పెళ్ళి జరిగింది. అప్పటికి భూదేవి వయసు కన్య. గాలిదేవుడూ చిన్నవాడే!

ఆమె ఆకుపచ్చని చీరకట్టి సిగలో రకరకాల పూలు పెట్టుకొని గంధం పూసుకొని ఎన్నో సొమ్ములను అలంకరించుకొని, పెళ్ళికూతురై కూర్చున్నది.

ఆ పెళ్ళికి చాలామంది ముత్తయిదువులు పేరంటానికి వచ్చారు. గులాబి, చేమంతి, మాలతి, విరజాజి, గన్నేరు సంపెంగ, పారిజాతం మొదలైన పుష్పకన్యలంతా రంగు రంగుల చీరెలను కట్టుకొనివచ్చారు

భూమిమీదనున్న చెట్లన్ని చిగిర్చినవి. ప్రతి చెట్టూ ఆకులతోనూ, చిగుళ్లతోనూ, ఫలాలతోనూ అలంకరించుకొన్నది. మల్లెలు, మొల్లలు, పారిజాతాలు మొదలైన పుష్పాలు సువాసనలతో పుడమి అంతా ఘుమ ఘుమలాడి పోయింది.

ప్రకృతి అంతా ఆనందంతో ఊగిపోయింది. కుండేళ్లూ, లేళ్లూ, సంతోషంతో గంతు లేసినవి. పక్షులు వీన సొంపుగా మంగళహారతులు పాడినవి. ఎక్కడ చూచినా సంతోషమే! సెలయేళ్ళు వాగులు జీవకలు గంతువేస్తూ ఉరకలు పెడుతూ జల జల ప్రవహించినవి. వృషభములు ఆనందంతో పొంగిపోయి 'అంబా' అంటూ రంకెలు పెట్టినవి. కప్పలు బెక బెకమని డప్పులు వాయించినవి నెమళ్ళు నృత్యము చేసినవి— అట్ల వైభవంగా జరిగిపోయింది ఆ పెళ్ళి.

గాలిదేవుడుకూడా చక్కగా అలంకరించుకొన్నాడు. పెళ్ళికూతురు గుచ్చి ఇచ్చిన పూల మాలలను మెడలో వేసుకొన్నాడు అప్పటికి ఆయనకు గడ్డం లేదు. చిన్నవాడు కాబట్టి పుష్పకన్యలతో ఆయన ఒంటిమీద సుగంధాలు మంచి పరిమళముల నిచ్చే పుప్పొడులూ చల్లారు ఘుమఘుమలాడుతూ ఆయన 'అక్కడనుంచి ఇక్కడకూ ఇక్కడనుంచి అక్కడకు తిరగడము సాగించాడు. ఆ చెట్టు దగ్గరకు వెళ్ళి ఏమో చెప్పనూ ఈ లతదగ్గరకు చెవులో ఏదో ఊదనూ ఇదీ ఆయన వరస.

ఆరోజున పొద్దస్తమానము పెళ్ళిసంబరాలు జరిగినవి. చీకటి పడ్డ తరువాత అంతా నిద్రపోయినారు.

భూదేవి గాలిదేవుడూ భార్యాభర్తలుగా కొన్నాళ్ళు కాపరం చేసినతరువాత వారికి ఒక బిడ్డ కల్గింది ఆమెకు పలుకురాణి అని పేరు పెట్టారు

పలుకురాణి చక్కనిచుక్క. ఆమె చెక్కిళ్ళపై గులాబీలు పూసినవి. తుమ్మెద రెక్కల చక్కని నలుపు ఆమె

కేశములకు అబ్బినది ఆమె పెదవులు మామిడి చిగుళ్ళు ఆ పెదవులపై చిరునవ్వొక్కటి ఎప్పుడూ మెరుస్తూ ఉంటుంది. ఆమె గాలిలో తేలిపోగలదు. నీటిపై నడువగలదు ఎంత దూర ప్రదేశాలకైనా ఇట్టే పోగలదు.

మేఘాలకు రాజు ఇంద్రుడు. మేఘాలన్నీ ఇంద్రుడు చెప్పినట్లు వింటవి. మీరు వెళ్ళి ఆ కొండపైని వర్షం కురవండి అంటే కురవాలిసిందే! వద్దంటే మానవలసిందే!... గాలిదేవుడుకూడా ఆయన మాట కాదనడు.

పలుకురాణిని గురించి ఇంద్రుని భార్య, ఇంద్రాణి విన్నది పలుకురాణి మిక్కిలి సౌందర్యవతి యని ఆమెకు తెలిసింది. ఆమె ఎప్పుడూ, జాజులు, మల్లెలు, పొగడలు, గోరంటలు తంగేడులు పూచిఉన్న ఉద్యాన వనములలో తిరుగుతూ ఉంటుందనీ, అనేక పుష్పాలమీద వ్రాలి, వాటిని ముద్దు పెట్టుకొని, వాని తనువులను పులకరింపజేసే తుమ్మెదల వెంట పడి ఆమె పరుగెత్తుతూ ఉంటుందనీ తెలతెలవారే సమయంలో గుబురుకొని ఉన్న రసాల వృక్షపు చిగురుటాకులను రాచుకొనిపోతూ మధురమైనధ్వనిచేయు పిల్లగాలిలో ఆమె ఆడుకొంటూ ఉంటుందనీ ఇంద్రాణి విన్నది.

ఇంద్రాణి వెంటనే మేఘాలకు కబురుచేసింది. పలుకురాణిని తనవద్దకు పంపమనీ ఆ పిల్ల తన చెలికత్తెలలో ఒకతెగా ఉంటుందనీ!

ఈ సంగతి గాలిదేవుడికి తెలిసింది. ఆయన ఇల్లాగ అనుకొన్నాడు. 'ఇదీ ఒకందుకు మంచిదే. శచీదేవి దగ్గర దేవకన్యలూ వాళ్ళూ ఉంటారు పలుకురాణి వాళ్ళతో కలిసి

మెలిసి తిరగడంవల్ల అమ్మాయికి మర్యాదలూ అవీ తెలుస్తవి. అనేకమంది దేవతలుకూడా అక్కడికి వస్తూ పోతూ ఉంటారు. అమ్మాయి అక్కడ ఉంటే మర్యాదగా ప్రవర్తించడమూ తెలుస్తుంది వినయమూ, మితభాషిత్వమూ మొదలైన సుగుణాలూ అలవడుతవి' ఇల్లా అనుకొని పలుకురాణిని శచీదేవి వద్దకు పంపాడు గాలిదేవుడు.

పలుకురాణి గాలిదేవుని కూతురేగా ! ఆ అమ్మాయికి తండ్రి గుణాలే అబ్బినవి. గాలిదేవుడికి ఏదైనా రహస్యం చెబితే ఆయన దానిని అందరికీ చెప్పేస్తాడు. బుయ్యిమంటూ పోయి ఏ పువ్వుకన్య చెవులోనో ఆ రహస్యం కాస్తా ఊదేస్తాడు. ఆ విషయం అందరికీ తెలిసిపోతుంది. అదీగాక గాలిదేవుడు మాటకారి ఒక్క క్షణం ఊరుకోలేడు ఏదో మాట్లాడుతూనే ఉంటాడు. గాలిలో వదిలిన కబురు అందరికి తెలిసిపోతుంది. ఈ రెండు గుణాలూ పలుకురాణికి అబ్బినవి !

ఒకసారి శచీదేవి పలుకురాణికి ఏవో కొన్ని రహస్యాలు చెప్పింది. ఆ పిల్ల ఆ సంగతులు అందరికీ చెప్పేసింది. అల్లాగ తన రహస్యాలు అందరికీ చెప్పిందని ఇంద్రాణికి తెలిసింది. ఆమెకు చాలాకోపం వచ్చింది. ఇటువంటి కొంటెపిల్ల నా రాణివాసంలో ఉంటానికి తగదు అని చెప్పి ఇంద్రాణి పలుకురాణిని భూలోకానికి పంపివేసింది.

మళ్ళీ పలుకురాణి తల్లి దగ్గరే ఉండటము మొదలుపెట్టింది. ఇప్పుడు పలుకురాణి కాస్త పెద్దపిల్ల అయింది. కాని ఆమె అల్లరి ఎక్కువైంది.

పలుకురాణి ప్రొద్దున్నే నిద్ర లేస్తుంది. గులకరాళ్ళపై జలజలామంటూ ప్రవహించే నిర్మలోదకంలో ప్రొద్దున్నే స్నానము చేస్తుంది...ఆమె ఆకుపచ్చని వలువలు ధరిస్తుంది. తలనిండా రకరకాల పూలు పెట్టుకొంటుంది. తరువాత కిల కిలా నవ్వుతూ సీతాకోకి చిలకల వెంటనో, ఝుమ్మని మ్రోత పెడుతూ పూవు పూవును పలుకరించే తుమ్మెద వెంటనో పడి పరుగెత్తుతుంది.

ఇక ఆ అమ్మాయి చేసే అల్లరికి అంతులేదు కోయిల 'కూ' అని కూస్తే తనూ 'కో, కో' అని వెక్కిరిస్తుంది. చిలుకలు, గోరువంకలు, గిజిగాళ్ళు, వడ్రంగి పిట్టలు, బంగారు పిచ్చుకలు వీటిని అనుసరిస్తుంది. చిలక పలుకులు పలుకుతుంది పిచ్చుకలలాగ కిచకిచమని ధ్వనులు చేస్తూంది ఆ అడవిలో తిరుగుతూ ఉంటుంది. ఎవ రేమంటే అది మళ్ళీ అనడము ఆ అమ్మాయికి బాగా అలవాటు అయిపోయింది. ఏ పక్షి ఏకూత కూస్తే తనూ అదే కూస్తుంది.

అయితే పలుకురాణి స్వతంత్రంగా ఒక్కమాటకూడా అనలేదు. ఎవరేమంటే మళ్ళీ ఆమాట అనడము మాత్రమే తెలుసు ఆ అమ్మాయికి! పలుకురాణీ! అని పిలిస్తే. పలుకురాణీ అంటుంది. రా అంటే 'రా' అంటుంది. 'పో' అంటే 'పో' అంటుంది. నవ్వితే నవ్వుతుంది ఏడిస్తే ఏడుస్తుంది.

ఇట్లా ఉంటూఉండగా, ఒకరోజున రాణి ఒకచక్కని పిల్లవాణ్ణి చూసింది. ఆ అబ్బాయి ఎంతోఅందంగాఉన్నాడు. మంచి శరీరచ్ఛాయ. కోటేరు పోసినట్లు ముక్కు, తళు

తళుక్కున మెరసే ఆ విశాలమైన కళ్ళు! మందహాస సుందర మైన వదనము!

ఆ అబ్బాయిని చూసీ చూడడంతోనే పలుకురాణి ఒడలు ఝల్లుమన్నది. ఆమె నేత్రాలలోకి కొత్తకాంతులు వచ్చినవి. దేహమంతా తేలిక అయింది. 'ఈ అబ్బాయిని నేను పెళ్ళి చేసుకొంటే ఎంత బాగుంటుంది!' అనుకొన్నది.

అయితే పలుకురాణి ఆ అబ్బాయితో 'ఓ అబ్బాయ్ నిన్ను నేను ప్రేమిస్తున్నాను. మనం ఇద్దరం వివాహం చేసి కొందాం' అని అనలేదుగా! స్వాతంత్రంగా ఏ మాటా అన లేదామె పాపం! ఎల్లాగూ తన కోరికను ఆ అబ్బాయికి తెలియజేయడము?

తన సంగతి ఇల్లాగ అయిందేనని ఆ అమ్మాయికి దుఃఖం వచ్చింది. పలుకురాణి ఒక కొండగుహాలో కూర్చుని ఏడ్చింది. ఆ అడవిలో ఎవరు ఉన్నారు ఆ పిల్లను ఆదరించేటందుకు!

చిలుకలు, గోరువంకలు, బంగారు పిచ్చికలు, గువ్వలు, గిజిగాండ్రు, వడ్రంగిపిట్టలు ఇవన్ని వచ్చి సమీపంలో ఉన్న తమ శాఖలపై కూర్చుని గుడ్లనీరు కుక్కుకొన్నవి. అయ్యో, పాపం అనుకొన్నవి.

లేడిపిల్లలు, జింకపిల్లలూ వచ్చి ఆమెచుట్టూ నిలబడినవి, 'ఆమె ఎందుకు ఏడుస్తున్నదో పాపం, వాటికి తెలియదు. కాని వాటికికూడా దుఃఖం వచ్చింది అవీ ఏడ్చినవి.

పలుకురాణి తన చుట్టూ గుమికూడిన మృగ, పక్షి సంతాన సందోహాన్ని చూచి మరీ దుఃఖించసాగింది. ఆమె కన్నీటి బిందువులు చెక్కిళ్ళమీదుగా జారి, సెలయేటి నీటిలో

బడి టప్పు టప్పుమని శబ్దం చేసినవి. అవి ముత్యాలై పోయినవి. ఆ ముత్యాలు సెలయేటిలో పడి దొర్లుకుంటూ వెళ్ళి, ఒక మహానదిని చేరుకొన్నవి. నదీప్రవాహం వాటిని జాగ్రత్తగా తీసికెళ్ళి సముద్రంలో పడేసింది. ఆ ముత్యాలు సముద్రంలో ఉండిపోయినవి. సముద్రంలో ముత్యాలు ఉండడానికి ఇదే కారణం.

ఇంతలో నెమలి ఒకటి వచ్చి పలుకురాణిని అడిగింది. 'ఎందుకమ్మా ఏడుస్తావూ?' అని. పలుకురాణి ఏమీ చెప్పలేక ఊరికే ఆ అబ్బాయి ఉన్న దిక్కుకు చూచి, కళ్ళనిండా నీళ్ళు పెట్టుకుంది. నెమలి తల్లి ఆ అమ్మాయి కడుపులో ఉద్దేశం గ్రహించింది.

నెమలి తల్లి కాసేపు ఆలోచించి ఇల్లా అన్నది... 'చూడూ అమ్మాయి ఏడవకు, ఒక ఉపాయంచెబుతానువిను. నీవు ఆ అబ్బాయి వెంటనే వెళ్ళు. అతను ఎక్కడికి వెడితే నీవు అక్కడికి వెళ్ళు... ఆ అబ్బాయి నీ సంగతి గ్రహిస్తాడు.'

పలుకురాణి సరే నన్నది ఆ అబ్బాయి వెంటనే నడిచింది. ఆ అబ్బాయి కొండ ఎక్కితే తానూ ఎక్కింది ఆయన కొండ దిగితే తానూ దిగింది

కొంతసేపు అయిన తరువాత ఆ కుర్రవాడు, ఎవరబ్బా ఈ ఈ అమ్మాయి! చక్కని పిల్లనే! ఎందుకో నా వెంట బడ్డది! ఏం కావాలో?' అనుకొన్నాడు.

అల్లాగ అనుకొని ఆ కుర్రవాడు వెనక్కు తిరిగి ఆ పిల్ల వంక చూచి 'ఏ అమ్మాయ్ ఎవరు నీవు?' అని అడిగాడు.

ఆ పిల్ల అతనివంక దీనంగా చూస్తూ 'ఎవరు నీవు?' అన్నది. ఇంకోమాట అనలేదుగా పాపం!

'నేను గొఱ్ఱెల కాపరిని, నాపేరు నార్సికస్ నీ వెవరు?' అని అడిగినాడు ఆ పిల్లవాడు 'నీవెవరవు?' అన్నది ఆ పిల్ల.

నేను అన్నమాటే అంటుందేమిటి ఈ అమ్మాయి! అని అనుకొని ఆశ్చర్యపోయినాడు ఆ అబ్బాయి.

ఎందుకు నా వెంటవస్తావు? అని ఆ పిల్లవాడు అంటే.. ఎందుకు నా వెంటవస్తావు—అని ఆ పిల్ల అన్నది.

'వెళ్ళిపో' అన్నాడు. వెళ్ళిపో అన్నది. నీకేమైనా పిచ్చా అన్నాడు నీకేమైనా పిచ్చా అన్నది. బాగానేవుంది వరస! అన్నాడు. ఆమాటే మళ్ళీ అన్నది ఆ అమ్మాయి.

ఆ అబ్బాయి ఏమన్నా, మళ్లీ ఆమాటే అనేది ఆ పిల్ల. నార్సికస్‌కు విసుగు పుట్టింది కోపంకూడా వచ్చింది. ఈ పిచ్చిదానితో నాకేంపని అనుకొని, ఆ పిల్లవాడు పరుగెత్తడం మొదలుపెట్టాడు. ఆ అమ్మాయి అతని వెంట బడ్డది.

ఆ అబ్బాయికి మరీ కోపంవచ్చి, 'ఛా పో' అన్నాడు. ఆ పిలకూడా ఛా పో అన్నది. దానిమీద నార్సికస్‌కు మరీ కోపంవచ్చి ఆ పిల్లకు అందకుండా పారిపోయాడు. ఆ పిల్ల అతనిని అందుకోలేకపోయింది. చూస్తూవుండగానే ఆ పిల్లవాడు కనబడకుండా పోయినాడు.

ఆ పిల్లకు ఏమి చేయడానికి తోచలేదు. ఎటుపోయినా డబ్బా ఆ అబ్బాయి! ఇటు పోయినాడేమోనని ఉత్తరపు

దిక్కుకు చూచింది. దక్షిణపు దిశ చూచింది. తూర్పుకు చూచింది. పడమరకు చూచింది. ఎక్కడా లేడు ఆ అబ్బాయి అరె ! ఏమైపోయినట్లు !

పైకి చూచింది ఆకాశంవైపు. ఆకాశంలోనూ లేడు. భూమిమీద లేడు. అరె ! ఏమైనట్లు !

పైగా చుట్టూ కొండలున్నవి. ఆ కొండలలో ఏగుహలోనో దాక్కుని ఉంటాడు ఆ పిల్ల ఆ అబ్బాయికోసం ఆ కొండలన్నీ వెతికింది. గుహాలన్నీ గాలించింది. లోయలన్నీ చూచింది. ఎక్కడా కనుపించలేదు.

పొద్దస్తమానం కొండలలో బడి తిరిగేది. ఆ అమ్మాయి రాత్రిళ్ళు కళ్ళు తెరుచుకు కూర్చునేది ... సూర్యోదయం కావడంతోనే మళ్లీ వెతకడం ఆరంభించేది. ఆ పిల్లవాడు మళ్ళీ కనిపించలేదు.

ఆ అబ్బాయికోసం వెతికింది, వెతికింది. వెతికింది ఎక్కడాఆ పిల్లవాడి జాడే తెలియలేదు.

ఆ అమ్మాయి పక్షులవంక మృగాలవంక చెట్లచేమల వంక దీనంగా చూచింది.

ఆ పిల్ల ఆ అబ్బాయి వెంటబడి తిరగడం వాళ్ళందరూ చూశారు. ఆ అమ్మాయి సంగతి వాళ్ళందరికీ తెలుసు... ఆ అమ్మాయి దీనమైన ముఖంచూచి వాళ్ళంతా అప్పుడే గ్రహించారు. అతడు ఆమెను మోసపుచ్చి వెళ్ళిపోయినాడని!

గాలిదేముడుకి కూడా తెలిసింది తనకుమార్తెకు జరిగిన అన్యాయాన్ని గురించి, ఆయన ఈ సంగతి అందరికి చెప్పాడు. అందరికీ విచారము కలిగింది.

ఇంకేముంది అడవిఅంతా గోలగోల' అల్లకల్లోలం అయిపోయింది. పక్షులన్ని కిచకిచమని, గిజగిజమని గోలచేసినవి. జంతువు'లన్ని కోపంతో అరచినవి. పెద్దపులులు సింహాలు కోపంతో గాండ్రు గాండ్రుమన్నవి. చెట్లు విచారంతో తలలను నేలకేసి బాదుకొన్నవి. సెలయేర్లు రొదచేస్తూ పరుగెత్తినవి. అయితే ఏంలాభం మళ్ళీ ఆ అబ్బాయి, ఆ అమ్మాయికి కనిపించలేదు.

పలుకురాణి ఆ పిల్లవాడికోసం బెంగ పెట్టుకొన్నది ఆ బెంగవలన ఆమె ఆహారం తినడము మానేసింది. నీళ్ళు త్రాగడం మానేసింది. 'చిక్కిపోయింది' చిక్కి చిక్కి శల్యం అయిపోయింది. ఒకరోజున ఆ అమ్మాయి చనిపోయింది. చనిపోయిందీ అంటే మనిషిగా కనపడడంలేదు. గాని ఆమె ఆత్మ అక్కడే ఉంది. అప్పటినుండి ఇప్పటివరకు ఆమెఆకొండ ప్రాంతాలలోనే ఉండిపోయింది.

ఇప్పటికీ కొండలున్న ప్రదేశంలోకి మనంవెళ్ళి పిలిస్తే ఆమె పలుకుతుంది. మనం ఏమాట అంటే ఆమాట మళ్లా అంటుంది... ఈ కథ అంతా తెలియనివాళ్లు దానిని ప్రతిధ్వని అంటారు. అంతేకాని శరీరం లేని పలుకురాణ్ణి ఆ కేక వేస్తున్నదనీ మనం అన్నమాట మళ్ళీ అంటున్నదనీ ఎవరికీ తెలియదు.

ఇక ఆ పిల్లవాడి సంగతి ఏమైందీ తెలుసు కొందాము. ఆ పిల్లవాడు ఆఅమ్మాయికి అందకుండా పారిపోయినాడే కాని

ఆ పిల్ల సౌందార్యాన్ని మరిచిపోలేక పోయినాడు. ఎప్పుడూ ఆ అమ్మాయే జ్ఞాపకము వస్తూ ఉండేది. మళ్ళీ ఆ అమ్మాయి కనపడితే బాగుండునని చాలా సార్లు అనుకున్నాడు. చివరకు వెతికి చూద్దామనుకున్నాడు.

నార్సికస్, పలుకురాణి కోసము వెదకడము మొదలు పెట్టాడు. కొండల్లో, లోయల్లో, మైదానాల్లో, నదీతీరాల్లో వెతికాడు. పొదల్లో దాక్కున్నదేమోనని నూరి చూశేవాడు. ఆకుల్లో దాక్కుందేమోనని చెట్లెక్కి చూశాడు. ఎక్కడా కనపడలేదు. పచ్చని పొలాల్లో వెతికాడు. దట్టమైన అడవులను గాలించాడు. ఎక్కడా కనిపించలేదు. ఏ దిశ నుంచి వాసన కొడితే, ఆ అమ్మాయి తలలో పెట్టుకున్న పూలనుంచే ఆ వాసనలు వచ్చినవని అనుకొనేవాడు. కోయిల కూ అంటే, దానికి ప్రతిగా ఆ పిల్ల పలుకుతుందేమోనని ఆతురతతో ఎదురు చూసేవాడు.

ఇల్లా వెతుకుతూ ఉండంగా కొండల మధ్య ఒక కొలను కనపడ్డది ఆ అబ్బాయికి... ఆ సరస్సులో వికసించిన కలువ పూలు ఎంతో అందంగా ఉన్నవి. ఆ పూల క్రింద పచ్చని ఆకులు నీటిపై పరచుకొని ఉన్నవి. రమణీయంగా ఉంది ఆ దృశ్యము.

ఆ అమ్మాయి ఆ ఆకుల క్రింద దాక్కున్నదేమోనని సందేహం కలిగింది నార్సికస్‌కు... వెంటనే ఆతడు ఆ సరస్సు ఒడ్డుకు పోయి తొంగిచూశాడు నీళ్ళల్లోకి ఆ నీళ్ళల్లో తన ప్రతిబింబమే ఆతనికి కనిపించింది. కాని నార్సికసుకు ఆ సంగతి తెలియదు. తన ముఖం ఎట్లా ఉంటుందో ఆతనికి తెలియదు.

నీళ్ళల్లోకి చూస్తే తన ముఖముయొక్క ప్రతిబింబము కనపడు తుందన్న విషయమే అతనికి తెలియదు. కాబట్టి అతను ఏమను కొన్నాడూ అంటే, నీళ్ళల్లో కనిపిస్తున్నది ఆ అమ్మాయి ముఖమే అనుకొన్నాడు. తాను ఎవరికోసమై వెతుకుతున్నాడో ఆ నీళ్ళల్లో దాక్కున్నదనీ అనుకొన్నాడు.

నార్సికస్ ఒడ్డున నుంచుని నీళ్ళల్లోకి నిదానంగాచూశాడు, ఆ పిల్లమొఖంవంక నీళ్ళల్లోనుంచి ఆ పిల్ల తేలినది నిదానంగా చూస్తున్నట్లు తోచింది అతనికి.

నార్సికస్ నవ్వాడు.నీళ్ళల్లోఉన్న పిల్లకూడా, నవ్వింది. ఇంకేం! ఆ అమ్మాయి నీళ్ళల్లో దాక్కొన్నది. తనవంకచూచి నవ్వుతున్నది. అని అనుకున్నాడు నార్సికస్.

ఆ పిల్ల చక్కని ముఖం చూస్తూ ఉండిపోయినాడతడు. ఆపిల్లకూడా తననుచూస్తూ ఉండిపోయిందనుకున్నాడు. నార్సికస్‌కు సంతోషం కలిగింది. అమ్మదొంగఇక్కడున్నావాబయటికిరాఅనిఅనుకొంటూ ఆపిల్లనుపట్టుకోవాలెననినీళ్ళల్లో చెయ్యిపెట్టాడు. నీళ్ళు కెలికినట్లుఅయింది. ఆ అమ్మాయిమాయమైంది

ఆ అబ్బాయి ఇల్లాగఅనుకొన్నాడు–ఈ పిల్ల సామాన్యపు పిల్లకాదు. దేవకన్య లేకపోతే జలకన్య... జలకన్యలు చాలా అందమైనవాళ్ళు వాళ్ళ ఇళ్ళు నీటి అడుగున ఉంటాయి. వాళ్ళు అప్పుడప్పుడు పైకి వస్తూ ఉంటారు.

'ఆ పిల్లను లాక్కొని వెళ్ళడానికికాని ఎత్తుకొని పోవడానికికాని ప్రయత్నం చేయకూడదు. అటువంటి ప్రయత్నం చేస్తే ఆ కన్యలు పారిపోయి నీటి అట్టడుగున ఉన్న ఆరు అంతస్తుల మేడలో దాక్కుంటారు. ఒకసారి అల్లాగ వెళ్ళి

పోయి దాక్కున్నారా, ఇక వాళ్ళను పైకి రప్పించడం ఎవరి తరముకాదు' ఈ సంగతులన్నీ జ్ఞాపకం వచ్చినవి నార్సికస్‌కు.

ఆ జలకన్యలు ఉన్నమాట నిజమే. వారిని గురించి. ఎన్నోకథలు పెద్దవాళ్ళు చెప్పగా తాను చిన్నప్పుడు విన్నాడు నీటిఅడుగున రత్నాలతోనూ, పగడాలతోనూ, ముత్యాల తోనూ కట్టిన మేడలలో వాళ్ళు ఉంటారు సగం చేప సగం మనిషి ఆకారంగల స్త్రీలు ఎంతో మంది ఈ జలకన్యలకు పరి చారకులుగా ఉంటారు. ఇటువంటి సంగతులు ఎన్నో ఆతనికి జ్ఞాపకం వచ్చినవి

ఈ అమ్మాయి నాకు మొదటిసారి కనుపించినప్పుడే మృదిగా మాట్లాడాల్సింది ఏదోపిచ్చిది అనుకొన్నాను. ఎంత పొరపాటు అయ్యింది ? ఇప్పుడైనా ఆ పిల్లను ఏదో విధంగా మంచి చేసుకోవాలె అని నిశ్చయించుకొన్నాడు నార్సికస్.

ఇహ ఆ పిల్లను మాట్లాడిద్దామనుకొని అతడు "ఓయ్ చూడు" అన్నాడు ఓయ్ చూడు అన్నమాటలు వినిపించినవి.

పలుకురాణి ఆ కొండ ప్రదేశాలలో ఉందన్నసంగతి మనకు తెలుసుగా, ఆ పిల్ల మనిషిగా కనుపించదుగాని మనం అన్నమాట మళ్ళీ అనడము మానలేదుగా !

అయితే ఆ పిల్ల ఆ కొండల్లో అక్కడే కనపడకుండా ఉంటున్నదని నార్సికస్‌కు తెలియదు. అతడు ఏమనుకున్నా డంటే, ఆ పిల్ల నీళ్ళల్లో ఉందనీ ఆ అమ్మాయే అట్లా మాట్లాడుతున్నదనీ.

అక్కడ ఉన్నావా అన్నాడు నార్సిసస్. 'అక్కడ ఉన్నావా?' అన్నది ఆ పిల్ల, అంటే ఆ పిల్లే అంటున్నట్లు ఆతనికి తోచింది.

'బయటికిరా' అన్నాడు. బయటికిరా అన్నది ఆపిల్ల. నీవు అందంగా ఉన్నావు అన్నాడు నీవు అందంగా ఉన్నావు! అన్నది.

ఈ మాటలు విని నార్సిసస్ చాలా సంతోషించాడు. తాను అందంగా ఉన్నట్లు ఆ పిల్ల ఒప్పుకొన్నట్లేగా! నేను నిన్ను పెండ్లాడుతాను అన్నాడు. నేను నిన్ను పెండ్లాడుతాను అన్నది.

నార్సిసస్ సంతోషంతో పొంగిపోయినాడు. పాపం ఆతనికి నీళ్ళల్లో కనబడుతున్నది తన ముఖ ప్రతిబింబమనీ కొండల్లో ఎవ్వరికీ కనపడకుండా ఉన్న పలుకురాణి తను అన్న మాట మళ్ళీ అంటున్నదనీ తెలియదు. నీళ్ళల్లో ఒక పిల్ల ఉందనీ, ఆ పిల్ల మాట్లాడుతూ ఉందని అనుకొంటున్నాడు.

నార్సిసస్ ఇట్లా చాలాసేపు మాట్లాడాడు. కాని ఎంత సేపటికి ఆ అమ్మాయి బయటకు రాకపోయేసరికి విసిగి ఆపిల్లను పట్టుకొందామని చూశాడు. పట్టుకుందామని నీళ్ళలో చెయ్యి పెడితే ఆపిల్ల మాయమౌతుంది. ఎన్నోసార్లు ఇల్లాగ ఆ పిల్లను పట్టుకొందామని ప్రయత్నం చేయడమూ, ఆ పిల్ల కనబడ కుండా పోవటమూ జరిగింది.

ఇక లాభము లేదనుకొన్నాడు. ఆ పిల్లను పట్టుకొంటా నికి ప్రయత్నం చేయకూడదనినిశ్చయించుకొన్నాడునార్సిసస్. ఆ చక్కని పిల్ల ముఖం చూస్తూఉంటే అంతే చాలునను కున్నాడు.

అంతే నార్సిససే ఆ పిల్లను చూస్తూ ఉండిపోయినాడు. కదలలేదు మెదలలేదు. అన్నపానాదులు లేకుండా అల్లాగ ఉండి పోయినాడు. క్రమంగా ఆతడు శుష్కించి చనిపోయినాడు. అతని శరీరం ఆ సరస్సు ఒడ్డునన భూమిలోకికూరుకుపోయింది. కొన్నాళ్లు అయినతరువాత అక్కడ ఒకచక్కని పూలమొక్క మొలిచింది. వాసలు కురవడంతోనే ఆ మొక్క పుష్పించింది. ఆ పువ్వు అన్ని పువ్వులలాగ తలెత్తుకొని సూర్యుని చూస్తూ ఉండదు. తలవంచుకొని నీళ్లల్లో తన ప్రతిబింబాన్ని చూస్తూ ఉంటుంది. అదే నార్సిసస్ పుష్పము. పలుకురాణి ఆత్మ ఇప్పటికీ కొండలున్న ప్రదేశాలలో తిరుగుతూ ఉంటుంది. అక్కడికివెళ్ళి మనము ఏ మాట అన్నామంటే ఆమాట మళ్ళీ అంటుంది. దానినే ప్రతిధ్వని అంటారు.

